ఓం మేఖలావతే నమః
మందగతయే నమః
మతిమత్కమలేక్షణాయ నమః
మహాబలాయ నమః
మహావీరాయ నమః
మహాప్రాణాయ నమః
మహామనసే నమః
యజ్ఞాయ నమః
యజ్ఞపతయే నమః
యజ్ఞగోప్త్రే నమః 610
యజ్ఞఫలప్రదాయ నమః
యశస్కరాయ నమః
యోగగమ్యాయ నమః
యాజ్ఞికాయ నమః
యాజకప్రియాయ నమః
రసాయ నమః
రసప్రియాయ నమః
రస్యాయ నమః
రఞ్జకాయ నమః
రావణార్చితాయ నమః 620

ఓం రక్షోరక్షాకరాయ నమః
రత్నగర్భాయ నమః
రాజ్యసుఖప్రదాయ నమః
లక్షాయ నమః
లక్షప్రదాయ నమః
లక్ష్యాయ నమః
లయస్థాయ నమః
లడ్డూకప్రియాయ నమః
లాస్యప్రియాయనమః
లాస్యపదాయ నమః 630
లాభకృల్లోకవిశ్రుతాయ నమః
వరేణ్యాయ నమః
వహ్నివదనాయ నమః
వంద్యాయ నమః
వేదాంతగోచరాయ నమః
వికర్త్రే నమః
విశ్వతశ్చక్షుషే నమః
విధాత్రే నమః
విశ్వతోముఖాయ నమః
వామదేవాయ నమః 640

ఓం విశ్వనేత్రే నమః
వజ్రిణే నమః
వజ్రనివారణాయ నమః
విశ్వబన్ధనవిష్కమ్భాధరాయ నమః
విశ్వామరప్రభవే నమః
శబ్దబ్రహ్మణే నమః
శమప్రాప్యాయ నమః
శమ్భుశక్తిగణేశ్వరాయ నమః
శాస్త్రే, శిఖాగ్రనిలయాయ నమః
శరణ్యాయ నమః 650
శిఖరీశ్వరాయ నమః
షడృతుకుసుమస్రగ్విణే నమః
షడాధారాయ నమః
షడక్షరాయ నమః
సంసారవైద్యాయ నమః
సర్వజ్ఞాయ నమః
సర్వభేషజభేషజాయ నమః
సృష్టిస్థితిలయక్రీడాయ నమః
సురకుఞ్జరభేదనాయ నమః
సిన్దూరితమహాకుమ్భాయ నమః
660

ఓం సదసద్వ్యక్తిదాయకాయ నమః
సాక్షిణే నమః
సముద్రమథనాయ నమః
స్వసంవేద్యాయ నమః
స్వదక్షిణాయ నమః
స్వతంత్రాయ నమః
సత్యసంకల్పాయ నమః
సామగానరతాయ నమః
సుఖినే నమః
హంసాయ నమః 670
హస్తి పిశాచీశాయ నమః
హవనాయ నమః
హవ్యకవ్యభుజే నమః
హవ్యాయ నమః
హృతప్రియాయాయ నమః
హర్షాయ నమః
హృల్లేఖామంత్రమధ్యగాయ నమః
క్షేత్రాధిపాయ నమః
క్షమాభర్త్రే నమః
క్షమాపరపరాయణాయనమః 680

ఓం క్షిప్రక్షేమకరాయ నమః
క్షేమానందాయ నమః
క్షోణీసురద్రుమాయ నమః
ధర్మప్రదాయ నమః
అర్థదాయ నమః
కామద్రాతే నమః
సౌభాగ్యవర్ధనాయ నమః
ఓం విద్యాప్రదాయ నమః
విభవదాయ నమః
భుక్తిముక్తిఫలప్రదాయ నమః 690
అభిరూప్యకరాయ నమః
వీరాయ నమః
శ్రీప్రదాయ నమః
విజయప్రదాయ నమః
సర్వవశ్యకరాయ నమః
గర్భదోషఘ్నే నమః
పుత్ర పౌత్రదాయ నమః
మేధదాయ నమః
కీర్తిదాయ నమః
శోకహారిణే నమః 700

ఓం దౌర్భాగ్యనాశనాయ నమః
ప్రతివాదిముఖస్తమ్భాయ నమః
దుష్టచిత్తప్రసాదనాయ నమః
పరాభిచారశమనాయ నమః
దుఃఖభఞ్జనకారకాయనమః
లవాయ నమః
త్రుటయే నమః
కళాయై నమః
కాష్ఠాయై నమః
నిమేషాయ నమః 710
ఘుట్యై నమః
ముహూర్తకాయ నమః
ప్రహరాయ నమః
దివాయ నమః
నక్తాయ నమః
అహోరాత్రాయ నమః
అహర్నిశాయ నమః
పక్షాయ నమః
మాసాయ నమః
అయనాయ నమః 720

ఓం వర్షాయ నమః
యుగాయ నమః
కల్పాయ నమః
మహాలయాయ నమః
రాశయే నమః
తారాయై నమః
తిథయే నమః
యోగాయ నమః
వారాయ నమః
కరణాయ నమః 730
అంశకాయ నమః
లగ్నాయ నమః
హోరాయై నమః
కాలచక్రాయ నమః
మేరవే నమః
సప్తర్షిభ్యో నమః
ధ్రువాయ నమః
రాహవే నమః
మందాయ నమః
కవయే నమః 740

ఓం జీవాయ నమః
బుధాయ నమః
భౌమాయ నమః
శశినే నమః
రవయే నమః
కాలాయ నమః
సృష్టిస్థితయే నమః
విశ్వస్మై నమః
స్థావరాయ నమః
జంగమాయ నమః 750
జగతే నమః
భువే నమః
అద్భ్యో నమః
అగ్నయే నమః
మరుతే నమః
వ్యోమ్నే నమః
అహంకృతే నమః
ప్రకృతయే నమః
పుంసే నమః
బ్రహ్మణే నమః 760

ఓం విష్ణవే నమః
శివాయ నమః
రుద్రాయ నమః
ఈశశక్తయే నమః
సదాశివాయ నమః
త్రిదశేభ్యో నమః
పితృభ్యో నమః
సిద్ధేభ్యో నమః
యక్షేభ్యో నమః
రక్షోభ్యో నమః 770
కిన్నరేభ్యో నమః
సాధ్యేభ్యో నమః
విద్యాధరేభ్యో నమః
భూతేభ్యో నమః
మనుపష్యేభ్యో నమః
పశుభ్యో నమః
ఖగేభ్యో నమః
సముద్రేభ్యో నమః
సరిద్భ్యో నమః
శైలేభ్యో నమః 780

ఓం భూతాయ నమః
భవ్యాయ నమః
భవోద్భవాయ నమః
సాఙ్ఖ్యాయ నమః
పాతఞ్జలాయ నమః
యోగాయ నమః
పురాణేభ్యో నమః
శ్రుత్యై నమః
స్మృతయే నమః
వేదాఙ్గేభ్యో నమః 790
సదాచారాయ నమః
మీమాంసాయై నమః
న్యాయవిస్తరాయ నమః
ఆయుర్వేదాయ నమః
ధనుర్వేదాయ నమః
గాన్ధర్వాయ నమః
కావ్యనాటకాయ నమః
వైఖానసాయ నమః
భాగవతాయ నమః
మానుషాయ నమః 800

ఓం పాఞ్చరాత్రకాయ నమః
శైవాయ నమః
పాశుపతాయ నమః
కాలముఖాయ నమః
భైరవశాసనాయ నమః
శాక్తాయ నమః
వైనాయకాయ నమః
సౌరాయ నమః
జైనఘార్హకసంహితాయై నమః
సతే నమః 810
అసతే నమః
వ్యక్తాయ నమః
అవ్యక్తాయ నమః
సచేతనాయ నమః
అచేతనాయ నమః
బంధాయ నమః
మోక్షాయ నమః
సుఖాయ నమః
భోగాయ నమః
యోగాయ నమః 820

ఓం సత్యాయ నమః
అణవే నమః
మహతే నమః
స్వస్తయే నమః
హూం రూపాయ నమః
వషడ్రూపాయ నమః
ఖడ్గభ్రువే నమః
స్వధామయాయ నమః
స్వాహారూపాయ నమః
శ్రౌషడ్రూపాయ నమః 830
వౌషడ్రూపాయ నమః
వషణ్మయాయ నమః
జ్ఞానాయ నమః
విజ్ఞానాయ నమః
ఆనందాయ నమః
బోధాయ నమః
సంవిదే నమః
శమాయ నమః
యమాయ నమః
ఏకస్మై నమః 840

ఓం ఏకాక్షరాయ నమః
ఏకాక్షరపరాయణాయ నమః
ఏకాగ్రతయే నమః
ఏకవీరాయ నమః
ఏకనేక స్వరూపద్ధృతే నమః
ద్విరూపాయ నమః
ద్విభుజాయ నమః
ద్వ్యక్షాయ నమః
ద్విరదాయ నమః
ద్విపరక్షకాయ నమః 850
ద్వైమాతురాయ నమః
ద్వివదనాయ నమః
ద్వంద్వాతీతాయ నమః
ద్వయాతిగాయ నమః
త్రిధామ్నే నమః
శ్రీకరాయ నమః
త్రేతాయై నమః
త్రివర్గఫలదాయకాయ నమః
త్రిగుణాత్మనే నమః
త్రిలోకాదయే నమః 860

ఓం త్రిశక్తీశాయ నమః
త్రిలోచనాయ నమః
చతుర్బాహవే నమః
చతుర్ణన్తాయనమః
చతురాత్మనే నమః
చతుర్ముఖాయ నమః
చతుర్విధోపాయకరాయ నమః
చతుర్విధఫలప్రదాయ నమః
చతురాననసంప్రీతాయనమః
చతుర్వర్ణాశ్రమాశ్రయాయ నమః 870
చతుర్విధవచోవృత్తిపరివృత్తిప్రవర్తకాయ నమః
చతుర్థీపూజనప్రీతాయ నమః
చతుర్థీతిథిసంభవాయ నమః
పఞ్చాక్షరాత్మనే నమః
పఞ్చాత్మనే, పఞ్చాస్యాయ నమః
పఞ్చకృత్యకృతే నమః
పఞ్చధారాయ నమః
పఞ్చవర్ణాయ నమః
పఞ్చాక్షరపరాయణాయ నమః
పఞ్చతాళాయ నమః 880

ఓం పఞ్చకరాయ నమః
పఞ్చప్రణవభావికాయ నమః
పఞ్చబ్రహ్మమయస్ఫూర్తయే నమః
పఞ్చవరణవారితాయ నమః
పఞ్చభక్ష్యప్రియాయాయ నమః
పఞ్చబాణాయ నమః
పఞ్చశివాత్మకాయ నమః
షట్కోణపీఠాయ నమః
షట్చక్రధామ్నే నమః
షడ్గ్రన్థిభేదకాయ నమః 890
షడధ్వధ్వాన్తవిధ్వంసినే నమః
షడఙ్గళమహాహ్రదాయ నమః
షణ్ముఖాయ నమః
షణ్ముఖభ్రాత్రే నమః
షట్ఛక్తిపరివారితాయ నమః
షడ్వైరివర్గనిధ్వంసినే నమః
షడూర్మిభయభఞ్జనాయ నమః
షట్కర్మదూరాయ నమః
షట్కర్మనిరతాయ నమః
షడ్రసాశ్రయాయాయ నమః 900

ఓం సప్తపాతాళచరణాయ నమః
సప్తద్వీపోరుమణ్డితాయ నమః
సప్తస్వర్గోకమకుటాయ నమః
సప్తసప్తివరప్రదాయ నమః
సప్తఙ్గరాజ్యసుఖదాయ నమః
సప్తర్షిగణమణ్డితాయ నమః
సప్తచన్ధోనిధయే నమః
సప్తహోత్రే నమః
సప్తస్వరాశ్రయాయాయ నమః
సప్తాబ్ధికేళితాసారాయ నమః
910
సప్తమాతృనిషేవితాయ నమః
సప్తచ్ఛదామోదమదాయ నమః
సప్తచందోముఖప్రియాయాయ నమః
అష్టమూర్తి ధ్యేయమూర్తయే నమః
అష్టప్రకృతికారణాయ నమః
అష్టాఙ్గయోగఫలభుజే నమః
అష్టపత్రామ్బుజాననాయ నమః
అష్టశక్తిసమృద్ధశ్రియే నమః
అష్టైశ్వర్యప్రదాయకాయ నమః
అష్టపీఠోపపీఠశ్రియై నమః
920

ఓం అష్టమాతృసమావృతాయ నమః
అష్టభైరవసేవ్యాయ నమః
అష్టవసువనన్ద్యా నమః
అష్టమూర్తిభృతే నమః
అష్టచక్రస్ఫురన్మూర్తయే నమః
అష్టద్రవ్యహవిఃప్రియాయ నమః
నవనాగాసనాధ్యాసినే నమః
నవనిధ్యనుశాసిత్రే నమః
నవద్వారపురాధారాయ నమః
నవధారనికేతనాయ నమః 930
నరనారాయణస్తుత్యాయ నమః
నవదుర్గానిషేవితాయ నమః
నవనాథమహానాథాయ నమః
నవనాగవిభూషణాయ నమః
నవరత్నవిచిత్రాఙ్గాయ నమః
నవశక్తిశిరోధృతాయ నమః
దశాత్మకాయ నమః
దశభుజాయ నమః
దశదిక్పతివన్దితాయ నమః
దశాధ్యాయాయ నమః 940

ఓం దశప్రాణాయ నమః
దశేన్ద్రియనియామకాయ నమః
దశాక్షరమహామన్త్రాయ నమః
దశాశావ్యాపివిగ్రహాయ నమః
ఏకాదశాదిభీరుద్రైస్సుతాయ నమః
ఏకాదశాక్షరాయ నమః
ద్వాదశోద్దణ్డదోర్దణ్డయ నమః
త్రయోదశధాబిన్న
విశ్వేదేవాధిదైవతాయ నమః 950
చతుర్దశేన్ద్రప్రభవాయ నమః
చతుర్దశమనుప్రభవే నమః
చతుర్దశాదివిద్యాఢ్యాయ నమః
చతుర్దశజగత్ప్రభవే నమః
సామపంచదశాయ నమః
పఞ్చదశీశీతాంశునిర్మలాయ నమః
షోడశాధారనిలయాయ నమః
షోడశస్వరమాతృకాయ నమః
షోడశాన్తపదావాసాయ నమః
షోడశేన్దుకళాత్మకాయ నమః
960

ఓం సప్తసప్తదశ్యై నమః
సప్తదశాయ నమః
సప్తదశాక్షరాయ నమః
అష్టాదశద్వీపపతయే నమః
అష్టాదశపురాణకృతే నమః
అష్టాదశౌషధిస్రష్ట్రే నమః
అష్టాదశవిస్మృతయే నమః
అష్టాదశలిపివ్యష్టిసమిష్టి
జ్ఞానకోవిదాయ నమః
ఏకవింశాయ, పుంసే నమః
ఏకవింశత్యఙ్గళిపల్లవాయ నమః
970
చతుర్వింశతిత్త్వాత్మనే నమః
పఞ్చవింశాఖ్యపూరుషాయ నమః
సప్తవింశతితారేశాయ నమః
సప్తవింశతియోగకృతే నమః
ద్వాత్రింశద్భైరవాధీకాయ నమః
చతుస్త్రింశన్మహహ్రదాయ నమః
షట్త్రింశత్తత్త్వసంభూతయే నమః
అష్టత్రింశత్కలాతనవే నమః
నమదోకోనపఞ్చశన్మరుద్వర్గ
నిరర్గళాయ నమః
పఞ్చశదక్ష రశ్రేణయే నమః 980

ఓం పఞ్చశద్రుద్రవిగ్రహాయ నమః
పఞ్చశద్విష్ణశక్తీశాయ నమః
పఞ్చశన్మాతృకాలయాయ నమః
ద్విపఞ్చశద్వపుశ్శ్రోణయే నమః
త్రిషష్ట్యక్షరసంశ్రయాయ నమః
చతుష్టష్ట్యర్ణనిర్ణేత్రే నమః
చతుష్షష్టి కళానిధయే నమః
చతుష్షష్టి మహాసిద్ధ యోగినీ
బృన్దవన్దితాయ నమః
అష్టషష్టిమహాతీర్థక్షేత్రభైరవ
భావనాయ నమః
చతుర్నవతిమంత్రాత్మనే నమః 990
షణ్ణవత్యధికప్రభవే నమః
శతానందాయ నమః
శతముఖాయ నమః
శతపత్రాయతేక్షణాయ నమః
శతానీకాయ నమః
శతధృతయే నమః
శతధారవరాయుధాయ నమః
సహస్రపత్రనిలయాయ నమః
సహస్రఫణి భూషణాయ నమః
సహస్రశీర్ష్ణేపురుషాయ నమః 1000

ఓం సహస్రాక్షాయ నమః
సహస్రపదే నమః
సహస్రనామసంస్తుత్యాయ నమః
సహస్రాక్షబలాపహాయ నమః
ఫణామండలసాహస్రఫణి
రాజకృతాసనాయ నమః
దశసాహస్రఫణాభృతఫణి
రాజకృతాసనాయ నమః
అష్టాశీతిసహస్రౌఘమహర్షి
స్తోత్రయన్త్రితాయ నమః
మహాకాయాయ నమః
మహాత్మనే నమః
పిచణ్డిలాయ నమః 1010
ఇష్టదాయ నమః
రసాయ నమః
ఆధారాయ నమః
వేదమయాయ నమః
హేరమ్బాయ నమః
స్కన్ద పూర్వజాయ నమః
లక్షాధీశప్రియాధారాయ నమః
లక్షాధారమనోమయాయ నమః
చతుర్లక్షజపప్రీతాయ నమః
చతుర్లక్ష ప్రకాశితాయ నమః 1020
చతురశీతిలక్షాణాం జీవానాం
దేహసంస్థితాయ నమః
కోటిసూర్యప్రతీకాశాయ నమః
కోటిచంద్రాంశునిర్మలాయ నమః
కోటియజ్ఞప్రమథనాయ నమః
శివాభవాద్యష్టకోటివినాయక ధురన్ధ
రాయ నమః
వరదాయ నమః
వంద్యాయ నమః
సప్తకోటి మహామన్త్రమన్త్రి
తావయవద్యుతయే నమః
త్రయస్త్రింశత్కోటి సుర శ్రేణీప్రణతపా
దుకాయ నమః
అనన్తదేవతాసేవ్యాయ నమః 1030
అనన్తశుభదాయాకాయ నమః
అనన్తనామ్నే నమః
అనన్తశ్రియే నమః
అనంతానన్త సౌఖ్యదాయ నమః

**శ్రీ గణపతి సహస్రనామావళి : సంపూర్ణాః**

# 23. వినాయక వ్రతకల్పం

## ప్రార్థన

ఉ. తొండమునేకదంతమును తోరపు బొజ్జయు వామహస్తమున్
మెండుగ మ్రోయు గజ్జలును మెల్లని చూపులు మందహాసమున్
కొండొక గుజ్జు రూపమును కోరిన విద్యలకెల్ల నొజ్జయై
యుండెడి పార్వతీ తనయ యోయి గణాధిప నీకు మొక్కెదన్

చం. తొలుత నవిఘ్నమస్తనుచు ధూర్జటినందన నీకు మొక్కెదన్
ఫలితము సేయుమయ్య నిను ప్రార్థన చేసెద నేకదంత నా
వలపటిచేత ఘంటమున వాక్కున నెప్పుడు బాయకుండుమీ
తలపున నిన్ను వేడెదను దైవగణాధిప లోకనాయకా!

కం. తలచితినే గణనాథుని! తలచితినే విఘ్నపతిని దలచిన పనిగా!
దలచినతినే హేరంబుని! దలచిన నా విఘ్నములను తొలగుట కొరకున్!

కం. అటుకులు కొబ్బరి పలుకులు! చిటి బెల్లము నానుబ్రాలు చెరుకు రసంబున్
నిటలాక్షునగ్ర సుతునకు! పటుకరముగ విందు చేతు ప్రార్థింతు మదిన్

శుభకార్యములు ప్రారంభించినపుడు ఆటంకములు ఏర్పడకుండా తలపెట్టిన పని నిర్విఘ్నంగా నెరవేరాలని గణాధిపతి అయిన విఘ్నేశ్వరుని ముందుగా పూజించాలి. వరసిద్ధి వినాయకవ్రతము ప్రముఖ శుభకర్మ అగుట వలన ఆ వ్రతమునకు ముందు గణపతిని పూజించాలి. పసుపుతో చేసిన గణపతికి కుంకుమ బొట్టు పెట్టి తమలపాకులో ఉంచవలయును. (ఆకు కొన తూర్పుదిశగా ఉండాలి) చిన్న పళ్లెములో బియ్యము పోసి ఆ బియ్యముపై పసుపుతో చేసిన గణపతిని తమలపాకుతో సహా ఉంచవలెను. దీపారాధన చేసి గణపతికి నమస్కరించి కింది విధంగా చదవాలి.

శ్లో॥శుక్లాంభరధరం విష్ణు, శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం, ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయే
ఆయం ముహూర్తస్సుముహూర్తో అస్తు....

ఆచమ్య – ఓం కేశవాయ స్వాహా ఓం నారాయణాయ స్వాహా

ఓం మాధవాయ స్వాహా ( ఈ మూడు నామములు చెప్తూ కుడి చేతిలో నీరు పోసుకుని తాగాలి) గోవిందాయనమః, విష్ణవే నమః, మధుసూధనాయనమః , త్రివిక్రమాయనమః, వామనాయనమః, శ్రీధరాయనమః, హృషీకేశాయనమః, పద్మనాభాయనమః, దామోదరాయనమః, సంకర్షణాయనమః, వాసుదేవాయనమః, ప్రద్యుమ్నాయనమః, అనిరుద్దాయనమః, పురుషోత్తమాయనమః అధోక్షజాయనమః, నారసింహాయనమః, అచ్యుతాయనమః, జనార్ధనాయమః, ఉపేంద్రాయమః, హరయే నమః, శ్రీ కృష్ణాయనమః,

(గణపతికి నమస్కరించి ఈ క్రింది శ్లోకములను పఠించాలి)

యశ్శివోనామరూపాభ్యాం యాదేవీ సర్వమంగళా
తయో స్సంస్మరణాత్పుంసాం సర్వతో జయమంగళం
లాభస్తేషాం, జయస్తేషాం, కుతస్తేషాం, పరాభవ!
యేషామిందీవరశ్యామో హృదయస్థో జనార్ధనః
ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదాం
లోకాభిరామం శ్రీరామం భూయో భూయోనమామ్యహం
శ్రీ లక్ష్మీ నారాయణాభ్యాం నమః, ఉమామహేశ్వరాభ్యాం నమః
వాణీహిరణ్యగర్భాభ్యాం నమః శచీపురందరాభ్యాం నమః, అరుంధతీ
వసిష్ఠాభ్యాం నమః, శ్రీ సీతారామాభ్యాం నమః సర్వేభ్యోమహాజనేభ్యనమః

**శ్లో ॥ ఉత్తిష్ఠంతు భూతపిశాచాః ఏతే భూమి భారకాః**
**ఏతేషా మవిరోధేన, బ్రహ్మకర్మ సమారభే**

**ప్రాణాయామము :** ఓం భూః, భువః, ఓం సువః, ఓం మహః, ఓం జనః ఓం తపః ఓం సత్యం, ఓం తత్సవితుర్వదేణ్యం, భర్గోదేవస్య ధీమహి, ధియోయోనః, ప్రచోదయాత్ ఓమాపోజ్యోతి రసోమృతం బ్రహ్మభూర్భవస్సువరోం!

**సంకల్పము :**

మమ ఉపాత్తదురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీతర్థ్యం, శుభాభ్యాం శుభే శోభన ముహుర్తే శ్రీ మహావిష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య, ఆద్యబ్రహ్మణః, ద్వితీయపరార్థే, శ్వేతవరాహకల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే భరతువర్షే, భరతఖండే మేరోర్థక్షిణ దిగ్భాగే శ్రీశైలస్య... ప్రదేశ, కృష్ణా గోదావర్యోర్మధ్యదేశే మమ స్వ.. వసతి... గృహే సమస్త, దేవతా, బ్రాహ్మణ హరిహర గురుచరణ సన్నిధా, అస్మిన్, వర్తమాన వ్యావహారిక చాంద్రామానేన శ్రీ .... నామ (సంవత్సరం పేరు చెప్పవలెను). సంవత్సరే దక్షిణాయనే, వర్షఋతౌ, భాద్రపదమాసే, శుక్లపక్షే చతర్థ్యాం, శుభ (వారం పేరు చెప్పవలెను) వాసరే, శుభ నక్షత్రే, శుభయోగే, శుభకరణ, ఎవం గుణ, విశేషణ, విశిష్టాయాం శుభతిధౌ శ్రీమాన్... గోత్రం... నామధేయః ధర్మపత్నీ, సమేతోహం శ్రీమతః, గోత్రస్య ... నామధేయస్య, ధర్మపత్నీ సమేతస్య, మమసకుటుంబస్య, క్షేమ స్థైర, ధైర్య, విజయ వీర్య, అభయ ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధ్యర్థం, ధర్మార్థ కామః మోక్ష చతుర్విధ ఫలపురుషార్థ సిద్ధ్యర్థం, పుత్రపౌత్రాభివృద్ధ్యర్థం, సకల కార్యేషు, సర్వదా, దిగ్విజయ సిద్ధ్యర్థం, శ్రీవరసిద్ధి వినాయక దేవతా ముద్ధిశ్య, శ్రీ వరసిద్ధి వినాయక దేవతా ప్రీత్యర్థం, వర్షే వర్షే ప్రయుక్త శ్రీ వరసిద్ధి వినాయక దేవతా పూజాంకరిష్యే! అదౌ నిర్విఘ్న పరిసమ్యార్థం శ్రీ మహాగణాధిపతి పూజాం కరిష్యే (రాగిపాత్రలో ఉన్న నీటిని భక్తితో తాకాలి) తదంగ కలశారాధనం కరిష్యే.

**కలశారాధనము :**

ఆచమనము చేయుటకు వాడు పాత్రకాక, వేరొక పాత్రలో నీటిని పోసి (కలశము) ఆ కలశమునకు చుట్టూగంధము, కుంకుమ పెట్టి దానియందు పుష్పములను, అక్షతలను ఉంచి దానిపై చేతిని ఉంచి ఈ కింది శ్లోకాన్ని పఠించాలి.

**శ్లో ॥ కులశస్యముఖే విష్ణుః కంతేరుద్ర స్సమాశ్రితం॥**
**మూలేతత్ర స్మితో బ్రహ్మ మధ్యే మాతృగణా స్మృతాః॥**
**కుక్షౌతు సాగరాస్సర్వే, సప్త ద్విపావసుంధరా**
**ఋగ్వేదోథ యజుర్వేద సామవేదోహ్యధ్వరణః**
**అంగైశ్చస్సహితాస్సర్వే కలశాంబు సమాశ్రితాః**

**శ్లో ॥ గంగేచయమునే కృష్ణే గోదావరి సరస్వతీ।**
**నర్మదే సింధు కావేర్కొ జలేస్మిన్ సన్నిధిం కురు॥**

అయాంతు దేవ పూజార్థం మమ దురిత క్షయ కారకా! కలశోదకేన దేవం, ఆత్మానం, పూజాద్రవ్యాణి చ సంప్రోక్ష్య (కలశములోని నీటిని, పుష్పముతో గణపతిపైన పూజ చేయువారి శిరస్సుపైన, పూజాద్రవ్యములపైన చల్లవలెను)

**ప్రాణప్రతిష్ఠ:**

పుష్పముతో పసుపు గణపతిని తాకుచూ ఈ కింది విధంగా చదువవలెను.

మం ॥ గణానాంత్వా గణపతింగ్ హవామహే, కవిం కవీనా ముపమశ్రవస్తమం! జ్యేష్ఠరాజెం, బ్రహ్మణా బ్రహ్మణ స్పత ఆనశృణ్వ న్యూతిభీస్పద సాదనమ్ః!!

మం ॥ అనునీతే పునరస్మాసు చక్షుః పునః ప్రాణమిహనో దేహిబోగం, జ్యోక్పశ్యేమ, సూర్యముచ్చరంత మనుమతే మృడయా నస్స్వస్తి అమృతం వై ప్రాణా అమృతమాపః ప్రాణానేవ యాధా స్థానపహ్వయతే, శ్రీ మహాగణాధిపతిం, సాంగం, సాయుధం, సవాహనం సశక్తి పత్నీ పుత్ర పరివార సమేతం, శ్రీ మహాగణాధిపతిం, ఆవాహయామి, స్థాపయామి, పూజయామి, స్థిరోభవ, వరదోభవ, సుప్రసన్నోభవ, స్థిరాసనం కురు గణపతి ప్రాణ ప్రతిష్ఠాపన ముహూర్తస్సుముహూర్తో అస్తు.

**షోడశోపచార పూజ**

శ్రీ మహాగణాధిపతియే నమః ధ్యాయమి ధ్యానం సమర్పయామి. ఆవాహయామి ఆసనం సమర్పయామి, రత్న సింహాసనం సమర్పయామి, పాదయోః పాద్యం సమర్పయామి, హస్తయోః అర్ఘ్యం సమర్పయామి, ముఖే ఆచమనీయం సమర్పయామి, శుద్ధదక స్నానం సమర్పయామి. స్నానానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి, వస్త్రార్థం హరిద్రాక్షతాన్ సమర్పయామి, యజ్ఞోపవీతార్థం హరిద్రాక్షతాన్ సమర్పయామి, గంధాన్ ధారయామి గంధస్యోపరి అలంకరణార్థం అక్షతాన్ సమర్పయామి. పుష్పైః పూజయామి (పూవులతో పూజించాలి) ఓం సుముఖాయనమః ఓం ఏకదంతాయనమః ఓం కపిలాయనమః ఓం గజకర్ణకాయనమః ఓం లంబోదరాయనమః ఓం వికటాయనమః ఓం విఘ్న రాజాయనమః ఓం గణాధిపాయనమః ఓంధూమకేతవేనమః ఓం గణాధ్యక్షాయనమః ఓం ఫాలచంద్రాయనమః ఓం గజాననాయనమః ఓం వక్రతుండాయనమః ఓం

స్కందపూర్వజాయనమః ఓం సర్వసిద్ధి ప్రదాయకాయనమః ఓం శ్రీ మహాగణాధిపతియేనమః నానావిధ పరిమళ పత్ర పుష్పాణి సమర్పయామి (అగరవత్తులను వెలిగించి ధూపము చూపాలి) శ్రీ మహాగణాధిపతయేనమః ధూపమాఘ్రాపయామి, దీపం దర్శయామి, ధూపదీపానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి, నైవేద్యం (బెల్లం ముక్కను తీసుకుని దానిపై ఉదకం చల్లి క్రింది విధంగా చదివి నివేదన చేయాలి) ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్ సత్యం త్వర్తేన పరిషించామి శ్రీ మహాగణాధిపతయే నమః అవసరార్థం గుడం నివేదయామి, అమృతమస్తు ... అమృతతోపస్తరణమసి, ఓం ప్రాణాయస్వాహా ఓం ఆపానాయ స్వాహా ఓం వ్యానాయ స్వాహా ఓం ఉదానాయ స్వాహా ఓం సమానాయస్వాహా, మధ్యే మధ్యే పానీయం సమర్పయామి, హస్తౌ ప్రక్షాళయామి పాదౌ ప్రక్షాళయామి శుద్ధాచమనీయం సమర్పయామి. తాంబూలం సమర్పయామి, కర్పూర ఆనంద దివ్య మంగళ నీరాజనం దర్శయామి నీరాజనానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి శ్రీ మహాగణాధిపతయే నమః సువర్ణ దివ్య మంత్ర పుష్పం సమర్పయామి. ఆత్మ ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి ఆనయాధ్యానావాహనాది షోడశోపచార పూజయాచ భగవాన్ సర్వాత్మకః శ్రీ మహాగణాధిపతి స్సుప్రీతస్సు ప్రసన్నో వరదో భవతు ఉత్తరేశుభకర్మణ్య విఘ్నమస్తు శ్రీ మహాగణాధిపతి ప్రసాదం శిరసాగృహ్ణామి (పూజ చేసిన అక్షతలు శిరస్సున ధరించవలెను)

మం : యజ్ఞేన యజ్ఞమయజంత దేవాః తాని ధర్మాణి ప్రధామాన్యాసన్ తేహనాకం మహిమాన స్సంచతే యాత్ర పూర్వే సాధ్యస్సంతి దేవాః। శ్రీ మహాగణాధిపతిం యథాస్థానముద్వాసయామి। శోభనార్థం పునరాగమనాయచ (పసుపు గణపతిని పూజమందిరంలో ఈశాన్య భాగాన ఉంచవలెను).

**శ్రీ వరసిద్ధి వినాయక వ్రతకల్పము**

ఈ వ్రతమునకు మట్టితో చేసిన వినాయక ప్రతిమను ఉపయోగించుట శ్రేష్ఠమని చెప్పుదురు. (పాలవెల్లిని ఫలపుష్పాదులతో అలంకరించి వేలాడదీయవలెను. దాని కింద పసుపు కుంకుమలతోను, వరిపిండితోను అలంకరించిన పీటను వేసి దానిపై ఒక తమలపాకును కొన తూర్పువైపుకు ఉండునట్లుగా ఉంచి ఆ ఆకుపై ప్రతిమను ఉంచవలెను).

శుక్లాం భరదరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయే!!

అని చదివి మొదట చెప్పినట్లుగా ఆచమనము, ప్రాణాయామము చేసి సంకల్పము చెప్పుకోనవలెను. తర్వాత వినాయక ప్రతిమను తొలుత పంచామృతం, తర్వాత నీటితో శుద్ధి చేయవలెను. (పంచామృతం – ఆవుపాలు, పెరుగు, నెయ్యి, తేనె, పంచదార కలిపిన మిశ్రమం)

ఆప్యాయస్వసమేతుతే విశ్వతస్సోమవృష్ణియం బవావాజస్య సంగధే(పాలు)

దధిక్రావ్ణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్యవాజనః సురభినోముఖాకర త్ర్పణ ఆయుగ్ంం షితారిషత్ (పెరుగు).

శుక్రమసీ జ్యోతిరసి, తేజోసి, దేవోవస్సవితో త్పునాత్వచ్ఛిద్రేణ, పవిత్రేణ వసోస్సూర్యర్శ్మిభిః (నెయ్యి)

మధువాతాఋతాయతే మధుక్షరంతి సింధవః మధీర్నస్సంత్వోషదీః, మధేక్తముతో షసి, మధుమాత్పర్థివగ్ంం రజః మధుద్యౌరస్తునః పితామధుమాన్నో వనస్పతి ర్మదుమాగ్ంం అస్తుసూర్యః మాధ్వీర్గావో భవంతునః (తేనె)

స్వాధుః పవస్వదివ్యాయ జన్మనే స్వాదురింద్రాయ సుహవీతు నామ్నే, స్వాదుర్మిత్రాయ, వరుణాయ వాయువే, బృహస్పతయే మధుమాగ్ంం ఆదాభ్యః (పంచదార).

అపోహిష్ఠామయో భువః తాన ఊర్జే దధాతన మహేరణాయచక్షసే, యోవశ్శితమోరసః తస్యభాజయతే హనః ఉశతీరివవమాతరః తస్మా అరంగమామవః యస్యక్షయాయజిస్వథ ఆపోజన యధాచనః (ఉదకం)

**ప్రాణప్రతిష్ఠ :**

ఓం అనునీతే పునరస్మాసుచక్షుః పునః ప్రాణమిహనో దేహిభోగం జ్యోక్పశ్యేమసూర్య ముచ్చరంత మనుమతే

మృడయానస్వస్తి అమృతం వై ప్రాణా అమృత మాపః ప్రాణానేవ

యథాస్థానముపహ్వాయతే, శ్రీ వరసిద్ధి వినాయకస్వామి ప్రాణ ప్రతిష్ఠాపన ముహుర్తస్సుముహుర్తోస్తు.

శ్రీ వరసిద్ధి వినాయకస్వామినే నమః

స్వామిన్ సర్వజగన్నాథ యావత్పూజావసానకం
తావిత్వం ప్రీతి భావేన బింబే స్మిన్ సన్నిధిం కురు
స్థిరోభవ, వరదోభవ, సుప్రసన్నభోవ మమ అభిముఖోభవ

**కల్పోక్త షోడశోపచార పూజ**

**ధ్యానం :**

భవసంచిత పాపౌఘ విధ్వంసన విచక్షణం
విఘ్నాంధకార భాస్వంతం విఘ్నరాజమహంభజే
ఏకదంతం, శూర్పకర్ణం గజవక్త్రం చతుర్భుజం
పాశాంకుత ధరం దేవం ధ్యాయేత్సిద్ధివినాయకం
ఉత్తమం గణనాథస్య వ్రతం సంపత్కరం శుభం
భక్తాభీష్టప్రదం తస్మాత్ ధ్యాయేత్వం విఘ్ననాయకం
శ్రీవరసిద్ధి వినాయకస్వామినే నమః – ధ్యాయామి ధ్యానం సమర్పయామి
శ్రీ వరసిద్ధి వినాయకస్వామినే నమః – ఆవాహనం సమర్పయామి
శ్రీ వరసిద్ధి వినాయకస్వామినే నమః – రత్న సింహాసనం సమర్పయామి
శ్రీ వరసిద్ధి వినాయకస్వామినే నమః – పాద్యం సమర్పయామి
శ్రీ వరసిద్ధి వినాయకస్వామినే నమః – హస్తయో అర్ఘ్యం సమర్పయామి
శ్రీ వరసిద్ధి వినాయకస్వామినే నమః –ముఖేవుద్ధాచమనీయం సమర్పయామి
శ్రీ వరసిద్ధి వినాయకస్వామినే నమః – మధుపర్కం సమర్పయామి
శ్రీ వరసిద్ధి వినాయకస్వామినే నమః – పంచామృతస్నానం సమర్పయామి
శ్రీ వరసిద్ధి వినాయకస్వామినే నమః – శుద్ధోదక స్నానం సమర్పయామి
స్నానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి
శ్రీ వరసిద్ధి వినాయకస్వామినే నమః – వస్త్రయుగ్మం సమర్పయామి
శ్రీ వరసిద్ధి వినాయకస్వామినే నమః – యజ్ఞోపవీతం సమర్పయామి
శ్రీ వరసిద్ధి వినాయకస్వామినే నమః – దివ్య శ్రీ చందనం సమర్పయామి
శ్రీ వరసిద్ధి వినాయకస్వామినే నమః – అలంకరణార్థం అక్షతాన్ సమర్పయామి
శ్రీ వరసిద్ధి వినాయక స్వామినే నమః – పుష్పాని సమర్పయామి

**అధాంగ పూజ**

ఓం గణేశాయ నమః - పాదౌ పూజయామి ॥

ఏకదంతాయనమః గుల్ఫౌ పూజయామి ॥

శూర్పకర్ణాయ నమః - జానునీ పూజయామి

విఘ్నరాజాయ నమః - జంఘే పూజయామి

అఖు వాహనాయ నమః - ఉరూ పూజయామి

హేరంబాయనమః - కటిం పూజయామి

లంబోదరాయ నమః - ఉదరం పూజయామి

గణనాధాయ నమః - నాభిం పూజయామి

గణేశాయ నమః - హృదయం పూజయామి

స్థూలకంఠాయ నమః కంఠం పూజయామి

స్కందాగ్రజాయ నమః స్కంధౌ పూజయామి

పాశహస్తాయనమః హస్తౌ పూజయామి

గజవక్త్రాయనమః  వక్త్రం పూజయామి

విఘ్నహంత్రే నమః - నేత్రౌ పూజయామి

శూర్పకర్ణాయ నమః కర్ణౌ పూజయామి

ఫాలచంద్రాయ నమః - లలాటం పూజయామి

సర్వేశ్వరాయ నమః - శిరః పూజయామి

విఘ్నరాజాయ నమః - సర్వాంగాని పూజయామి

ఏకవింశతి పత్ర పూజ : (ప్రతి నామమునకు ముందు 'ఓం' చేర్చుకోవలెను)

సుముఖాయనమః - మాచీపత్రం పూజయామి

గణాధిపాయనమః - బృహతీ పత్రం పూజయామి

ఉమాపుత్రాయ నమః - బిల్వ పత్రం పూజయామి

గజాననాయ నమః - దుర్వాయుగ్మం పూజయామి

హరసూనవే నమః - దుత్తూరపత్రం పూజయామి

లంబోదరాయ నమః - బదరీపత్రం పూజయామి

గుహాగ్రజాయ నమః - అపామార్గపత్రం పూజయామి

గజకర్ణాయ నమః – తులసీ పత్రం పూజయామి
ఏకదంతాయ నమః – చూత పత్రం పూజయామి
వికటాయ నమః – కరవీర పత్రం పూజయామి
భిన్న దంతాయ నమః – విష్ణుక్రాంతపత్రం పూజయామి
వటవే నమః – దాడిమీపత్రం పూజయామి
సర్వేశ్వరాయ నమః – దేవదారు పత్రం పూజయామి
ఫాలచంద్రాయ నమః – మరువకపత్రం పూజయామి
హేరంభాయ నమః – సింధువారపత్రం పూజయామి
శూర్పకార్ణాయ నమః – జాజీపత్రం పూజయామి
సురాగ్రజాయ నమః – గండకీపత్రం పూజయామి
ఇభవక్త్రాయ నమః – శమీపత్రం పూజయామి
వినాయకాయ నమః – అశ్వత్థపత్రం పూజయామి
సురసేవితాయ నమః – అర్జునపత్రం పూజయామి
కపిలాయ నమః – అర్కపత్రం పూజయామి
శ్రీ గణేశ్వరాయ నమః – ఏకవింశతి పత్రాణి పూజయామి

**అథాష్టోత్తర శతనామ పూజ : (ప్రతి నామమునకు ముందు 'ఓం' చివర నమః చేర్చవలెను. ముందుగా 'కేశవ నామాలు' చదువుకోవలెను.)**

| | | |
|---|---|---|
| ఓం కేశవాయ నమః | శ్రీ కృష్ణాయ నమః | ఓం శివప్రియామ |
| ఓం గజాననాయ నమః | ఓం శీఘ్రకారిణే | ఓం భక్తజీవితాయ |
| ఓం గణాధ్యక్షాయ | ఓం శాశ్వతాయ | ఓం జితమన్మథాయ |
| ఓం విఘ్నరాజాయ | ఓం బలాయ | ఓం ఐశ్వర్యకారణాయ |
| ఓం వినాయకాయ | ఓం బలోత్థితాయ | ఓం జ్యాయసే |
| ఓం ద్వైమాతురాయ | ఓం భవాత్మజాయ | ఓం యక్షకిన్నరసేవితాయ |
| ఓం ద్విముఖాయ | ఓం పురాణపురుషాయ | ఓం గంగాసుతాయ |
| ఓం ప్రముఖాయ | ఓం పూష్ణే | ఓం గణాధీశాయ |
| ఓం సుముఖాయ | ఓం పుష్కరోత్క్షిప్తవారిణే | ఓం గంభీరనినదాయ |
| ఓం కృతినే | ఓం అగ్రగణ్యాయ | ఓం నటవే |

ఓం సుప్రదీపాయ
ఓం సుఖనిధయే
ఓం సురాధ్యక్షాయ
ఓం సురారిఘ్నే
ఓం మహాగణపతయే
ఓం మాన్యాయ
ఓం మహాబలాయ
ఓం హేరంబాయ
ఓం లంబజఠరాయ
ఓం హ్రస్వగ్రీనాయ
ఓం మహోదరాయ
ఓం మదోత్కటాయ
ఓం మహావీరాయ
ఓం మంత్రిణే
ఓం మంగళస్వరాయ
ఓం ప్రమధాయ
ఓం ప్రథమాయ
ఓం ప్రాజ్ఞాయ
ఓం విఘ్నకర్త్రే
ఓం విఘ్నహంత్రే
ఓం విశ్వనేత్రే
ఓం విరాట్పతయే
ఓం శ్రీపతయే
ఓం వాక్పతయే
ఓం శృంగారిణే
ఓం ఆశ్రితవత్సలాయ

ఓం అగ్రపూజ్యాయ
ఓం అగ్రగామినే
ఓం మంత్రాకృతే
ఓం చామీకర ప్రభాయ
ఓం సర్వస్మై
ఓం సర్వోపాస్యాయ
ఓం సర్వకర్త్రే
ఓం సర్వనేత్రే
ఓం సర్వసిద్ధి ప్రదాయ
ఓం సర్వసిద్ధయే
ఓం పంచహస్తాయా
ఓం పార్వతీనందనాయ
ఓం ప్రభవే
ఓం కుమారగురవే 69
ఓం అక్షోభ్యాయ
ఓం కుంజరాసురభంజానయ
ఓం మోదకప్రియాయ
ఓం కాంతిమతే
ఓం ధృతిమతే
ఓం కామినే
ఓం కపిత్థ ప్రియాయ
ఓం బ్రహ్మచారిణే
ఓం బ్రహ్మరూపిణే
ఓం బ్రహ్మవిద్యాదిదానభువే
ఓం జిష్ణవే
ఓం విష్ణుప్రియాయ

ఓం అభీష్టవరదాయ
ఓం జ్యోతిషే
ఓం భక్తనిధయే
ఓం భావగమ్యాయ
ఓం మంగళప్రదాయ
ఓం అవ్యక్తాయ
ఓం మంగళప్రదాయ
ఓం సత్యధర్మిణే
ఓం సుఖయే
ఓం సరసాంబు నిధయే
ఓం మహేశాయ
ఓం దివ్యాంగాయ
ఓం మణికింకిణీమేఖలాయ
ఓం సమస్తదేవతామూర్తయే
ఓం సతతోత్థితాయ
ఓం విఘాతకారిణే
ఓం విశ్వరక్షాకృతే
ఓం కళ్యాణగురవే
ఓం ఉన్మత్తవేషాయ
ఓం అపరాజితాయ
ఓం సమస్త జగదాధారాయ
ఓం సర్వేశ్వరప్రదాయ
ఓం ఆక్రాంతచిదచిత్ప్రభవే
ఓం విఘ్నేశ్వరాయ
ఓం వరసిద్ధి వినాయకస్వామినే నమః

(అష్టోత్తర శతనామపూజాం సమర్పయామి)

**అథ దూర్వాయుగ్మ పూజా**

గణాధిపాయనమః - దుర్వాయుగ్మం పూజాయమి

ఉమా పుత్రాయ నమః - దూర్వాయుగ్మం పూజయమి

అఘవాహనాయనమః - దూర్వాయుగ్మం పూజయమి

వినాయకాయనమః - దూర్వాయుగ్మం పూజయమి

ఈశపుత్రాయనమః - దూర్వాయుగ్మం పూజయమి

సర్వసిద్ధి ప్రదాయకాయనమః - దూర్వాయుగ్మం పూజయమి

ఏకదంతాయనమ ః - దూర్వాయుగ్మం పూజయమి

ఇభవక్త్రాయనమ ః - దూర్వాయుగ్మం పూజయమి

మూషిక వాహనాయ నమః - దూర్వాయుగ్మం పూజయమి

కుమారగురవే నమ ః - దూర్వాయుగ్మం పూజయమి

శ్లో ॥ దశాంగం గుగ్గూలూ పేతం సుగంధం సుమనోహారం ।

ఉమాసుత నమస్తుభ్యం గృహాణ వరదోభవన ధూపమాఘ్రాపయామి

(అగరొత్తులు వెలిగించి ధూపం సమర్పించాలి)

శ్లో ॥ సాజ్యం త్రివర్తి సంయుక్తం వహ్నినా యోజితం మయా।

గృహాణ మంగళం దీపం ఈశపుత్ర నమోస్తుతే దీపం దర్శయామి

(దీపం వెలిగించి నమస్కరించుకోవాలి)

శ్లో ॥ సుగంధాన్ సుకృతాంశ్చైవమోదకాన్ ఘృతం ॥

నైవేద్యం గృహ్యేతాం దేవ చణముద్గైః ప్రకల్పితాన్॥

భక్షం బోజ్యంచ లేహ్యంచ చోష్యం పానియమేవచ!

ఇదం గృహాణనైవేద్యం మయాదత్తం వినాయక నైవేద్యం సమర్పయామి (మహానైవేద్యం) (వండిన పదార్థాలన్నీ దేవుని వద్ద ఉంచి నైవేద్యం సమర్పించాలి)

ఓం భూర్భువస్సువ ః తత్సత్ వితుర్వరేణ్యం

భర్గో దేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్ ॥

సత్యం త్వర్దేన పరిసించామి అమృత మస్తు

ఓం ప్రాణాయస్వాహా, ఓం అపానాయస్వాహా, ఓం వ్యానాయస్వాహా

ఓం ఉదానాయ స్వాహా, ఓం సమానాయ స్వాహా॥
మధ్యే మధ్యే పానీయం సమర్పయామి
అమృతాపిధానవసి ఉత్తరాపోషణం, సమర్పయామి హస్తాప్రక్షాళయామి,
పాదౌ ప్రక్షాళయామి, శుద్ధాచమనం సమర్పయామి
తాంబూలం – పూగీఫల సమాయుక్తం, నాగవల్లీ
దళైర్యుతం / కర్పూర చూర్ణ సంయుక్తం, తాంబూలం
ప్రతిగృహ్యతామ్! తాంబూలం సమర్పయామి
ఆచమనం – శుద్ధాచమనం సమర్పయామి
నీరాజనం – ఘృతవర్తి సహస్రైశ్చ కర్పూర శకలైసదా!నీరాజనం
మయాదత్తా గృహాణ వరదోభవ నీరాజనం సమర్పయామి
నీరాజనానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి

మంత్రపుష్పం – (పుష్పము చేతిలోకి తీసుకుని నిలబడి) సదానందంచ విఘ్నేశ పుష్కలాసీ ధనానిచ, భూమ్యం స్థితాని భగవన్ స్వీకరుష్య వినాయకః శ్రీ వరసిద్ధి వినాయక స్వామినే నమః సువర్ణ దివ్య మంప్రతుష్పం సమర్పయామి,

ఆత్మప్రదక్షిణ – యాని కాని చ పాపాని జన్మాంతర కృతానిచ, తానితాని ప్రణశ్యంతి ప్రదక్షణ పదే పదే పాపోహం పాప కర్మాహం పాపాత్మా పాపసంభవః త్రాహిమాం కృపయాదేవ శరణాగతవత్సల, అన్యధా శరణం నాస్తి త్వమేవ శరణం మమ తస్మాత్ కారణ్యభావేనతరక్ష రక్ష వినాయక శ్రీ వరసిద్ధి వినాయక స్వామినే నమః ఆత్మ ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి

సాష్ఠాంగ నమస్కారం : ఉరసా శిరసా దృష్ట్యా మనసా వచసా తథా
పద్భ్యాం కరాభ్యాం కర్ణాభ్యాం ప్రణామోష్టాంగ ఉచ్యతే।
శ్రీ వినాయకస్వామినే నమః సాష్టాంగ నమస్కారం సమర్పయామి

**రాజోపచారములు :** ఛత్రం ధారయామి, చామరం వీజయామి
నృత్యం దర్శయామి, గీతం శ్రావయామి, దర్పణం దర్శయామి
అశ్వానారోహయామి, గజనారోహమామి, రథానారోహయామి,
శ్రీ వరసిద్ధి వినాయక స్వామినే నమః సమస్త రాజోపచార, భక్త్యుపచార,

శక్త్యుపచార, మంత్రోపచార పూజాం సమర్పయామి
యస్యస్మృత్యాచనామోక్త్యా తపః పూజాక్రియాదిషు, న్యూనం
సంపూర్ణతాంయాతి సద్యోవందే గణాధిపం మంత్రహీనం
క్రియాహీనం, భక్తిహీనం వినాయక, భగవాన్ సర్వాత్మక, శ్రీ వరసిద్ధి
వినాయక దేవతా సుప్రీత సుప్రపన్నోవరదో భవతు అపరాధ క్షమార్పణ
అపరాధ సహస్రాణి క్రియంతే అహర్నిశం మయా దాసోయమితి
మాం మత్వాక్షమస్వపరమేశ్వర, ఆవాహనం నజానామి నజానామి
విసర్జనం పూజా విధించ నాజానామి క్షమస్వపరమేశ్వర సర్వాపరాధాన్
క్షమస్య, శ్రీ వరసిద్ధి వినాయక దేవతా ప్రసాదం శిరసాగృహ్ణామి
(పూజలోని పూవులు, అక్షతలు శిరసున ధరించవలెను) శ్రీ వరసిద్ధి వినాయక
స్వామి ప్రసాదేన సర్వకార్యేషు సర్వదా దిగ్విజయస్తు
(పూజా విధానం సంపూర్ణం)

**ఉద్వాసన మంత్రం**

యజ్ఞేన యజ్ఞ మయజంత దేవాస్తాని ధర్మాణి ప్రథమాన్యాసన్
తేహనాకం మహిమానస్సచన్తే యత్ర పూర్వే సాధ్యాస్సంతిదేవాః॥
శ్రీ వరసిద్ధి వినాయక స్వామినే నమః యథాస్థానం
ప్రవేశయామి శోభనార్థం క్షేమాయ పునరాగమనాయచ
హరిః ఓం తత్సత్, బ్రహ్మార్పణమస్తు॥

**వినాయక వ్రతకథ ప్రారంభం**

(సూతమహాముని శౌనకాది మహామునులకు విఘ్నేశ్వరోత్పత్తియు, చంద్రదర్శన దోషకారణమును తన్నివారణమును చెప్పసాగెను)

పూర్వం గజరూపము గల రాక్షసేశ్వరుండు శివుని గూర్చి ఘోరతపంబొనర్చెను. అతని తపమునకు మెచ్చి పరమేశ్వరుడు ప్రత్యక్షమై వరంబు కోరుకొమ్మనెను. అంత గజాసురుండు పరమేశ్వరుని స్తుతించి “స్వామి! నీవు ఎల్లప్పుడు నా ఉదరమునందే వసించియుండు” మని కోరెను. భక్తసులభుండగు ఆ మహేశ్వరుండు అతని కోర్కెదీర్చ గజాసురుని యుదరమందు ప్రవేశించి సుఖంబున ఉండెను.

కైలాసమున పార్వతీదేవి భర్తజాడతెలియక పలు తెఱంగుల అన్వేషించచు కొంత కాలమునకు గజాసుర గర్భస్థుండగుటం తెలిసి రప్పించుకొను మార్గంబు గానక, పరితపించుచు విష్ణుమూర్తిని ప్రార్థించి తన పతి వృత్తాంతము తెలిపి ఓ మహానుభావా! పూర్వము భస్మాసురుని బారి నుంచి నా పతిని రక్షించి నాకొసంగితివి ఇపుడు కూడ ఉపాయాంతరముచే రక్షింపు"మని విలపించెను. శ్రీహరి పార్వతిని ఊరడించి పంపెను. అంత ఆ హరి బ్రహ్మాది దేవతలను పలిపించి గజాసుర సంహారమునకు గంగిరెద్దుల మేళమే యుక్తమని నిశ్చయించి నందిని గంగిరెద్దుగ అలంకరించి బ్రహ్మాదిదేవతలందరిచే తలకొక వాయిద్యమును ధరింపజేసి తానును చిరుగంటలు సన్నాయి దాల్చి గజాసురపురంబు జొచ్చి జగన్మోహనంబుగా ఆడించుచుండెను. ఇది గజాసురండు విని, వారల పిలిపించి తన భవనమునెదుట నాడించ నియమించె.

బ్రహ్మాది దేవతలు వాద్య విశేషంబులు భోరుసలుప జగన్నాటక సూత్రధారియగు ఆ హరి చిత్ర విచిత్రంబు గంగిరెద్దునాడించుచుండ, గజాసురుడు పరమానందభరితుడై "మీకేమి కావలయునో కోరుకొండు ఒసంగెద" ననగ, హరి సమీపించి ఇది శివుని వాహనమగు నంది శివుని కనుగొనుటకు వచ్చెగాన శివునొసంగు మని పలికె. ఆ మాటలకు గజాసురుడు నివ్వెరపడి అతనిని రాక్షసాంతకుండగు శ్రీహరిగా గుర్తించి తనకు మరణమే నిశ్చయమనుకొనుచు తన గర్భస్థుండగు పరమేశ్వరుని "నా శిరస్సును త్రిలోక పూజ్యముగ చేసి, నా చర్మము ధరించపవే యని ప్రార్థించి విష్ణుమూర్తికి తన అంగీకారము తెలిపెను. అంత విష్ణుమూర్తి నందిని ప్రేరేపించెను. నందియు తన శృంగములచే గజానునుని చీల్చి సంహరించెను. అంత మహేశ్వరుడు గజాసుర గర్భమునుండి బహిర్గతుండై విష్ణుమూర్తిని స్తుతించెను. అంత ఆ హరి "దుష్మాత్ముల కిట్టి వరంబులీయరాదు. ఇచ్చినచో పామునకు పాలు పోసినట్లుగునని ఉపదేశించి బ్రహ్మాది దేవతలను వీడ్కొలిపి తానును వైకుంఠమునకేగెను. శివుడు నందినెక్కి కైలాసంబునకు అతివేగంబున జనియె.

కైలాసంబున పార్వతీదేవి భర్త రాకను దేవాదుల వలన విని ముదమంది అభ్యంగన స్నానమాచరించుచు నలుగుపిండినొక బాలునిగ జేసి ప్రాణం బొసంగి

సింహద్వారమునకాపుంచె, స్నానానంతరం పార్వతి సర్వాభరణముల అలంకరించుకొనుచు పత్యాగమనమును నిరీక్షించుచుండె. అంత పరమేశ్వరుడు వచ్చి నందినారోహించి లోపలకి ఇక పోబోవ సింహద్వారమందున బాలకుడు అడ్డగింప కోపావేశుండై త్రిశూలముచే బాలుని కంఠంబు దునిమిలోనికేగెను. అంత పార్వతీదేవి భర్తను గాంచి ఎదురేగి అర్ఘ్యపాద్యాదులచే పూజించెను. వారిరువురు పరమానందమున ప్రియభాషణములు ముచ్చటించుచుండ ద్వారమండలి బాలుని ప్రసంగము వచ్చెను. అంత మహేశ్వరుడు తానొనరించిన పనికి చింతించి తాను తెచ్చిన గజాసుర శిరంబును ఆ బాలునికి అతికించి ప్రాణంబొసంగి గజాననుండని నామం బొసంగెను. ఆ బాలుని పుత్ర ప్రేమంబున ఉమామహేశ్వరులు పెంచుకొనుచుండిరి. గజాననుండు తల్లిదండ్రులను పరమ భక్తితో సేవించుచుండెను. ఇతడు సులభంగా ఎక్కి తిరుగుటకు "అనింద్యు"డను ఎలుకను వాహనముగా చేసుకొనెను. కొంత కాలమునకు పార్వతీపరమేశ్వరులకు కుమారస్వామి జనియించెను. ఇతడు మహాబలశాలి. వాహనము నెమలి కుమారస్వామి దేవతల సేనానయకుడై ప్రఖ్యాతి గాంచియుండె.

**విఘ్నేశాధిపత్యము**

ఒకనాడు దేవతలు, మునులు, మానవులు పరమేశ్వరుని సేవించి విఘ్న నివారణకొరకు ఒకని అధిపతిగా తమకు ఒసంగుమని కోరిరి. తాను జ్యేష్ఠుడను గనుక ఆ ఆధిపత్యము తన కసంగుమని గజాననుడు కోరగా, గజాననుడు మరుగుజ్జువాడు అనర్హుడు. అసమర్ధుడు గావున ఈ ఆధిపత్యము తన కొసంగుమని కుమారస్వామియు తండ్రిని వేడుకొనిరి.

అంత ఆ కుమారుల జూచి "మీలో నెవ్వరు ముల్లోకములుంలందరి పుణ్యనదులలో స్నానమాడి ముందుగా నా యొద్దకు వచ్చెదరో, వారికి ఈ ఆధిపత్యంబు ఒసగుదు"నని మహేశ్వరుండు పలుక అట్లేయని సమ్మతించి కుమారస్వామి నెమలి వాహనమును ఎక్కి వాయువేగంబున ఏగెను. అంత గజాననుండు ఖిన్నుడై తండ్రిని సమీపించి ప్రణమిల్లి 'అయ్యా నా అసమర్థత తామెఱింగియు ఇట్లానతీయతగునే?! మీ పాదసేవకుండను, నాయందు కటాక్షముంచి

తగు ఉపాయంబు తెల్పి రక్షించవే!! యని ప్రార్థింప మహేశ్వరుడు దయాళుడై "సకృత్ నారాయణేత్యుక్త్వాపుమాన్ కల్పశతత్రయ! గంగాది సర్వతీర్థేషు స్నాతో భవతి పుత్రక!" కుమారా! ఒకసారి నారాయణ మంత్రమును జపించిన మాత్రమున మూడువందల కల్పంబులు పుణ్యనదులలో స్నానమొనర్చినవాడగుదువు" అని సక్రమంబుగా నారాయణ మంత్రము ఉపదేశింప గజాననుండు అత్యంత భక్తితో ఆ మంత్రమును పఠించుచు తల్లిదండ్రులకు మూడుసార్లు ప్రదక్షిణలొనర్చెను.

ఆ మంత్ర ప్రభావమున అంతకు పూర్వము గంగానదిలో స్నానమాచరించనేగిన కుమారస్వామికి గజాననుండు ఆ నదిలో స్నానమాడి తనకెదురుగా వచ్చుచున్నట్లు కనిపించెను. ఆ విధముగా మూడుకోట్ల యాభై లక్షల నదులలో ఇటులనే చూసి ఆశ్చర్యపడుచు కైలాసంబున కేగి తండ్రి సమీపమందున్న గజాననుని గాంచి నమస్కరించి తన బలమును నిందించుకుని తండ్రీ! అన్నగారి మహిమ తెలియక అట్లంటిని క్షమించుము" ఈ ఆధిపత్యము అన్నగారికే ఒసంగుము అని ప్రార్థించెను. అంత పరమేశ్వరునిచే భాద్రపద శుద్ధ చతుర్థినాడు గజాననుకి విఘ్నాధిపత్యం ఒసంగబడియె.

భాద్రపద శుద్ధ చతుర్థినాడు సర్వదేశస్థులు విఘ్నేశ్వరునికి తమ విభవము కొలది కుడుములు, అపూపములు మున్నగు పిండి వంటలు టెంకాయలు, పాలు, తేనె, అరటిపండ్లు, పానకము, వడపప్పు మొదలగునవి సమర్పించి పూజింప విఘ్నేశ్వరుడు సంతుష్టుడై కుడుములు మున్నగునవి భుజించుయు, కొన్ని వాహనమునకు ఒసంగియు, కొన్ని చేత ధరించుయు మంద గమనంబున సూర్యాస్తమయ వేళకు కైలాసంబుకు దిగి తల్లిదండ్రులకు ప్రణామంబు చేయబోవ, ఉదరము భూమికానిన చేతులు భూమికందవాయె, బలవంతంగా చేతులానించిన చరణంబులు ఆకాశంబు చూచె, చంద్రుడది చూసి వికటంబు నవ్వె. అంత రాజదృష్టి సోకిన రాలుగూడ నుగ్గగునను సామెత నిజమగునట్లు విఘ్నదేవుని గర్భంబు పగిలి అందున్న కుడుములు తత్ప్రదేశమునందు ఎల్లెడెల దొర్లెను. గజాననుండును మృతుండయ్యెను. అంత పార్వతి శోకించుచు చంద్రుని జూచి, "పాపాత్ముడా! నీ దృష్టి తగిలి కుమారుడు మరణించెను. కావున నిన్ను జూచిన వారు పాపాత్ములై నీలాపనిందల పాలుగదురు గాక అని శపించెను.

**ఋషిపత్నులకు నీలాపనింద కలుగుట**

పార్వతి శపించిన ఆ సమయాన సప్త ఋషులు యజ్ఞము చేయుచు తమ భార్యలతో అగ్ని ప్రదక్షిణం చేయుచుండిరి. అగ్నిదేవుడు ఋషిపత్నులను మోహించి శాప భయంబున అశక్తుడై క్షీణించుచుండ ఆ సంగతి అగ్ని భార్యయగు స్వాహాదేవి గ్రహించి అరుంధతీ రూపం దక్కతక్కిన ఋషిపత్నుల రూపంబు తానే దాల్చి పతికి ప్రణయంబు సేయ ఋషులద్దానిని గనుగొని అగ్నిదేవునితో ఉన్నవారు తమ భార్యలే అని శంకించి ఋషులు తమ భార్యలను విడనాడిరి, పార్వతీ శాపానంతరం ఋషిపత్నులు చంద్రుని చూచుటచే వీరికిట్టి నీలాపనింద కలిగినది. దేవతలు మునులును ఋషిపత్నుల ఆపద పరమేష్టికిం దెల్ప అతడు సర్వజ్ఞుడగుటచే అగ్నిహోత్రుని భార్యయే ఋషిపత్నుల రూపంబు దాల్చి వచ్చుటను తెల్పి సప్తఋషులను సమాధానపరిచి వారితో కూడా బ్రహ్మ కైలాసంబునకు ఏతెంచి ఉమామహేశ్వరుల సేవించి మృతుడై పడియున్న విఘ్నేశ్వరుని బ్రతికించి ముదంబుగూర్చెను. అంత దేవాదులు "ఓ పార్వతీదేవీ! నీవొసంగిన శాంపబున లోకంబులకెల్ల కీడు వాటిల్లెగాన దానిని ఉపసంహరింపుమని ప్రార్థించెను. అంత పార్వతి సంతుష్టాంతరంగియై కుమారని జేరదీసి ముద్దాడి "ఏ దినంబున విఘ్నేశ్వరుని చూచి చంద్రుడు నవ్వెనో ఆ దినంబున చంద్రుని చూడరాదు " అని శాపావకాశం బొసంగె. అంత బ్రహ్మాదులు సంతసించుచు తమ గృహంబులకు ఏగి భాద్రపద శుద్ధ చతుర్థియందు మాత్రము చంద్రుని జూడక జాగరూకులై సుఖంబుగ ఉండిరి. ఇట్లు కొంతకాలంబు గడిచె.

**శమంతకోపాఖ్యానము**

ద్వాపరయుగంబున ద్వారాకవాసియగు శ్రీకృష్ణుని నారదుడు దర్శించి స్తుతించి ప్రియ సంబాషణంబుల జరుపుచు స్వామీ! సాయం సమయమయ్యె. ఈనాడు వినాయక చతుర్థి గావున పార్వతీదేవి శాపంబుచే చంద్రుని చూడరాదు. గావున నిజగృహంబున కేగెద శలవిండు" అని పూర్వ వృత్తాంతమంతయు శ్రీకృష్ణునికి దెల్పి నారదుడు స్వర్గలోకమున కేగెను. నాటిరాత్రి శ్రీకృష్ణుడు క్షీరప్రియుడగుటచే తాను మింటివంక చూడక గోష్ఠమునకు పోయి పాలు పిదుకుచూ పాలలో చంద్రుని ప్రతిబింబము చూచి, ఆహా! ఇక నాకెట్టి అపనింద రానున్నదోయని

సంశయమున ఉండెను. కొన్నాళ్ళకు సత్రాజిత్తు సూర్య వరముచే శమంతకమణిని సంపాదించి ద్వారకా పట్టణమునకు శ్రీకృష్ణ దర్శనార్థమై పోవ శ్రీకృష్ణుడు మర్యాదచేసి ఆ మణిని మహారాజునకిమ్మని అడిగెను. అందుకతడు "ఇది ఎనిమిది బారువుల బంగారమును దినంబున కొసంగును", ఇట్టిది ఏ ఆప్తునకైన ఎంతటి మందమతియూన ఇవ్వడు అనెను. కృష్ణుడు పోనిమ్మని ఊరుకొనెను.

అంత ఒకనాడు సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనుండు ఆ శమంతకమణిని కంఠమున ధరించి, వేటాడ అడవికి జనియె, ఒక సింహమామణిని మాంసఖండమని భ్రమించి ప్రసేనుని చంపి ఆ మణిని కొనిపోవచుండ ఒక భల్లూకము (జాంబవంతుడు) సింహమును చంపి, మణిని తన కొండబిలమున తొట్టిలో పవళించియున్న కుమార్తెయగు జాంబవతికి ఆటవస్తువుగా ఒసంగెను. మరునాడు సత్రాజిత్తు తమ్ముని మృతి విని కృష్ణుండు మణి ఇవ్వలేదని నా సోదరుని జంపి రత్నమపహరించెనని పట్టణమున చాటెను. అది కృష్ణుని విని, నాడు క్షీరమున చంద్ర బింబమును చూచిన దోష ఫలంబని ఎంచి దాని బాపుకొన బంధుసతమేతుడై అరణ్యమునకు పోయి వెదకగా ఒకచోట ప్రసేనుని కళేబరము, సింగపు కాలిజాడయు, పిదప భల్లూక చరణ విన్యాసంబును గాంచెను. ఆ దారిబట్టి బోవుచుండ ఒక పర్వత గుహ ద్వారంబు చూసి పరివారమును అచట విడిచి కృష్ణుడు గుహ లోపలికేగి అచట బాలిక ఉయ్యాలపై కట్టబడియున్న మణిని జూచి అచ్చుటికి బోయి ఆ మణి చేతపుచ్చుకుని వచ్చుచున్నంత ఉయ్యాలలోని బాలిక యేడ్వదొడంగెను. అంత దాదియును వింత మనిషి వచ్చుననుచు కేకవేసెను.

అంత జాంబవంతుడు రోషావేశుండై చనుదెంచి శ్రీకృష్ణుని పైబడి అరచుచు. నఖంబుల గుచ్చుచు, కోరలం గొఱకుచు ఘోరంగా యుద్ధము చేయ కృష్ణుడును వానిని బడద్రోసి వృక్షముల చేతను, రాళ్లచేతను తుదకు ముష్టిఘాతములచేతను రాత్రింబగళ్లు, ఎడతెగక ఇరువది ఎనిమిది దినములు యుద్దమొనర్ప జాంబవంతుడు క్షీణబలుండై దేహంబెల్ల నొచ్చి భీతిచెందుచు తన బలంబు హరింపచేసిన పురుషుడు రావణ సంహారియగు శ్రీరామచంద్రునిగా దలంచి అంజలి ఘటించి దేవాదిదేవా! భక్తజనరక్షకా! నిన్ను త్రేతాయుగంబున రావణాది దుష్టరాక్షస సంహరణార్థమై

అవతరించి భక్తజనులను పాలించిన శ్రీరామచంద్రునిగా నెరింగితి. ఆ కాలంబున నాయందలి వాత్సల్యముచే వరంబు కోరుమని ఆజ్ఞయెసంగ నాబుద్ధి మాంద్యమును మీతో ద్వంద్వయుద్ధంబు జేయవలెనని కోరుకొంటిని కాలాంతరమున అది జరుగగలదని సెలవిచ్చితిరి. అది మొదలు మీ నామస్మరణ చేయుచు అనేక యుగములు గడుపుచు ఇచట నుండ, ఇపుడు తాము నా నివాసమునకు దయచేసి నా కోరిక నెరవేర్చితిరి. నా శరీరంబంతయు శిథిలమై ప్రాణములు కడబట్టె, జీవితేచ్ఛ నశించె నా అపరాధములు క్షమించి కాపాడుము. నీకన్న వేరు దిక్కులేదు అనుచు భీతిచెంది పరిపరి విధముల ప్రార్థింప శ్రీకృష్ణుడు దయాళుడై జాంబవంతుని శరీరమంతయు తన హస్తంబుతో నిమిరి భయంబు బాపె. భల్లూకేశ్వరా! శమంతకమణి నపహరించినట్లు నాపై ఆరోపించిన అపనింద బాపుకొన ఇటు వచ్చితిని గావున మణి నొసగుము. నేనేగెద నని జాంబవంతునకు దెల్ప అతడు శ్రీకృష్ణునికి మణిసహితముగా తన కుమార్తెయగు జాంబవతిని కానుకగా నొసంగెను. అంత తన ఆలస్యమునకు పరితపించి బంధుమిత్ర సైన్యంబులకు ఆనందంబు కలిగించి కన్యారత్నముతోను, మణితోను శ్రీకృష్ణుడు పురంబు చేరి సత్రాజిత్తును రావించి పిన్న పెద్దలను చేర్చి సత్రాజిత్తు “అయ్యో! లేనిపోని నిందమోపి దోషంబునకు పాల్పడితిని” అని విచారించి మణి సహితముగా తన కూతురగు సత్యభామను భార్యగా సమర్పించి తప్పు క్షమింపుమని వేడుకొనెను. శ్రీకృష్ణుడు సత్యభామను గైకొని మణి వలదని మరల ఒసంగెను. శ్రీకృష్ణుడు శుభముహూర్తమున జాంబవతీ సత్యభామలను పరిణయమాడ అచటికి వచ్చిన దేవాదులు, మునులు స్తుతించి మీరు సమర్థులు గనుక నీలాపనింద బాపుకొంటిరి. మాకేమి గతి?! అని ప్రార్థింప ప్రమాదవశంబున చంద్రదర్శనమయ్యేనేని ఆనాడు గణపతిని యాథివిధి పూజించి ఈ శమంతకమణి కథను విని అక్షతలు శిరంబున దాల్చువారు నీలాపనిందలు పొందకుండెదరు గాక అని అనతీయ దేవాదులు సంతసించి తమ నివాసంబులకేగి ప్రతి సంవత్సరం, భాద్రపద శుద్ధ చతుర్థియందు దేవతలు మహర్షులు మానవులు మున్నగువారందరు తమ తమ విభవము కొలది గణపతిని పూజించి అభీష్టసిద్ధి గాంచుచు సుఖముగ నుండిరని పాపమోక్ష ప్రకారంబు శౌనకాది మునులకు వినిపించి

సూతమహాముని వారిని వీడ్కొని నిజాశ్రమంబున కరిగె.

"సర్వేజనా స్సుఖినోభవంతు"

**విఘ్నేశ్వరుని మంగళహారతులు**

జయ మంగళం నిత్య శుభ మంగళం!!
శ్రీ శంభుతనయునకు సిద్ధిగణానాథునకు వాసిగల దేవతావంద్యునకును
ఆ సరస విద్యలకు ఆది గురువైనట్టి భూసురోత్తమ లోకపూజ్యనకును
॥జయమంగళం నిత్య శుభమంగళం॥
నేరేడు మారేడు నెలవంక మామిడి దుర్వార చెంగల్వ ఉత్తరేణు
వేరు వేరు గదెచ్చి వేడ్కతో పూజింతు పర్వమున దేవగణపతికినపుడు ॥జయ॥
సుచిరముగ భాద్రపద శుద్ధ చవితియందు పొసగ సజ్జనులచే పూజగొల్తు
శశి చూడరాదన్న జేకొంటి నొక వ్రతము పర్వమున దేవగణపతికినిపుడు ॥జయ॥
పానకము వడపప్పు పనస మామిడిపండ్లు దానిమ్మ ఖర్జుర ద్రాక్షపండ్లు
తేనెతో మాగిన తియ్య మామిడి పండ్లు మాకు బుద్ధినిచ్చి గణపతికినిపుడు॥జయ॥
ఓ బొజ్జ గణపయ్య నీ బంటునేనయ్య ఉండ్రాళ్ళమీదికి దండుపంపు
కమ్మనినెయ్యియ్యి కడుముద్దపప్పును బొజ్జవిరుగగ దినుచును పొరలుచున్ ॥జయ॥
వెండి పళ్ళెములోన వేయినేల ముత్యాలు కొండలుగ నీలములు కలయబోసి
మెండుగను హారములు మెడనిండ వేసికొని దండిగా నీకిత్తు ధవళారతి ॥జయ॥
పువ్వులను నినుగొల్తు పుష్పాల నినుతొల్తు గంధాల నినుగొల్తు కస్తూరినీ
ఎప్పుడూ నినుగొల్తు ఏకచిత్తమున్న పర్వమున దేవగణపతికినిపుడు ॥జయ॥
ఏకదంతంబును ఎల్లగజవదనంబు బాగయిన తొండంబు వలపు కడుపు
జోకయిన మూషికము పరక నెక్కాడుచు భవ్యుడగు దేవగణపతికినిపుడు ॥జయ॥
మంగళము మంగళము మార్తాండతేజునకు మంగళము సర్వజ్ఞ వందితునకు
మంగళము ముల్లోక మహిత సంచారునకు మంగళము దేవగణపతికినపుడు ॥జయ॥
సిద్ధివిఘ్నేశ్వర ప్రసిద్ధిగా పూజింతు ఒనరంగ నిరువదియొక్క పత్రి
దానిమ్మ మరువమ్ము దర్భ విష్ణుక్రాంత యుమ్మెత్త దూర్వార యుత్తరేణి ॥జయ॥
కలువలు మారేడు గన్నేరు జిల్లేడు దేవకాంచన రేగు దేవదారు

జాజి బలురక్కసి జమ్మిదాసానపువ్వు గరిక మాచిపత్రి మంచి మొలక ॥జయ॥
ఆగరు గంధాక్షత ధూప దీప నైవేద్య తాంబూల పుష్పోపహారములను
భాద్రపద శుద్ధ చవితిని కుడుములు నానుబ్రాలు ఉండ్రాళ్ళు పప్పు ॥జయ॥
పాయసము జున్ను తేనెయు భక్తిమీర కోరిపూజింతు నిన్నెపుడు కోర్కెలలర ॥జయ॥
బంగారు చెంబుతో గంగోదకముదెచ్చి సంగతిగ శుశువునకు జలకమార్చి
మల్లెపూవులు దెచ్చి మురహరిని పూజింతురంగైన నా ప్రాణలింగమునకును ॥జయ॥
పట్టుచీరలు మంచి పాడిపంటలు గల్గి ఘనముగా కనకములు కరులు హరులు
ఇష్ట సంపదలిచ్చి యేలిన స్వామికి పట్టభద్రుని దేవ గణపతికినిపుడు ॥జయ॥
ముక్కంటి తనయుడని ముదముతో నేనును చక్కనైన వస్తు సమితి గూర్చి
నిక్కముగ మనమును నీయందె నేనిల్పి ఎక్కువగుపూజలాలింపచేతు ॥జయ॥
మల్లెలా మొల్లలా మంచి సంపెంగలా చల్లనైనా గంధసారములను
ఉల్లమలరగ మంచి ఉత్తమపు పూజలు కొల్లలుగ నేజేతు కోరి విఘ్నేశ ॥జయ॥
దేవాదిదేవునకు దేవతారాధ్యునకు దేవేంద్రవంద్యునకు దేవునకును
దేవతలు మిముగొల్చు తెలిసి పూజింతురు భవ్యుడగు దేవగణపతికినిపుడు ॥జయ॥
చెంగల్వ చేమంతి చెలరేగి గన్నేరు తామరలు తంగేడు తరచుగాను
పుష్పజాతులు తెచ్చి పూజింతు నేనిపుడు బహుబుద్ధ గణపతికి బాగుగాను ॥జయ॥
మారేడు మామిడి మాదీఫలంబులు ఖర్జూర పనసలును కదళికములు
నేరేడు నెంవంది టెంకాయ తేనెయు చాలగా నిచ్చెదరు చనువుతోడ ॥జయ॥
ఓ బొజ్జగణపతి ఓర్పుతో రక్షించి కాచినన్నేలుమీ కరుణతోను
మాపాల గలవని మహిమీద నెల్లపుడు కొనియాడుచుందును కోర్కెదీర

॥జయ మంగళం నిత్య శుభమంగళం॥

❖ ❖ ❖

# గ్లోబల్ న్యూస్ ప్రచురణలు




హిందూ సంప్రదాయ
పండుగలు -ఉత్సవాలు
రూ. 125/-




తెలుగునాట ప్రసిద్ధ
గణపతి ఆలయాలు
రూ. 125/-




శ్రీ గణేశ స్తోత్రాలు
రూ. 60/-




చురకలు
రూ. 40/-

**ఎగువన తెలిపిన ఏ పుస్తకాన్ని అయినా మీరు పొందదలచిన ఈ క్రింది చిరునామాకు లేఖ వ్రాసిన లేదా సూచించిన నెంబరుకు ఫోన్ చేసినా వి.పి. ద్వారా పుస్తకాలు పంపబడతాయి పోస్ట్‌మ్యాన్‌కు డబ్బు చెల్లించి పుస్తకాలు తీసుకోవచ్చు. పోస్టేజీ ఉచితం**

---


**Global News**
B2 F12, Ramaraja Nagar, N.H.7, Suchitra Centre,
Suchitra Junction Post, Secunderabad - 500 067.
Phone : 9246165059